# రాష్ట్రీయుల మద్యపాన నిషేధ నిశ్చయము

## ప్రజలు యీ దురభ్యాసమును మానుకొనుటకు ప్రమాణ మొనరించుట

## మద్యపాన నిరోధక సంఘమువారి ప్రయత్నము

(గోలకొండ విలేఖరి)

హైదరాబాదు మార్చి ౯

కాంగ్రెసువారు దేశమునందు మంత్రివర్గము లేర్పరచి రాష్ట్ర పరిపాలనా సూత్రముల ధరించుటచే అనేక నూతనవిషయములకు, దేశాభ్యుదయమునకు, కార్యరూప మేర్పడినది. ప్రజలను దేశమును నీతిబాహ్యులుగా, హేయముగా పరిగణింపజేయుచున్న మద్యపానము నామూలాగ్రముగా రూపుమాపించుటకు కాంగ్రెసువారు కృతనిశ్చయులైన విషయము పాఠకులకు చిరపరిచితము. దీనియందు సత్వరవిజయము లభించుటకు రాష్ట్రీయప్రభుత్వములు నిషేధశాసనములు నిర్మించిరి. మదరాసు రాష్ట్రమందలి సేలంజిల్లాలో పరీక్షార్థమేర్పరచిన ఈ యుద్యమము మిక్కిలి విజయమైనటుల అచ్చటి కలెక్టరుగారి నివేదిక ప్రచురింపబడినది. ఈ సాఫల్యతగాంచి బొంబాయి, మధ్యరాష్ట్రము, సంయుక్తరాష్ట్రము, బీహారు, కలకత్తా, పంజాబు, సరిహద్దురాష్ట్రములలో మద్యపాననిషేధ ప్రచారమారంభింపబడినది.

బ్రిటిషుప్రాంతములందు విజయవంతముగా జరుగుచున్న యీ సంస్కరణము గాంచి స్వదేశ సంస్థానములందు సహితము ప్రవేశపెట్ట బడినది. పటియాలా సంస్థాన మీవిషయమున సోదరసంస్థానములకు మార్గదర్శిగాగలదు. అచ్చట సంపూర్ణనిషేధము కలదు. మైసూరు, బరోడా గ్వాలియరు, సంస్థానములలో ఆచరింపబడు చున్నది.

ఇక యీ హైదరాబాదు సంస్థానమునందీ విషయమెప్పుడో ప్రభుత్వమువారి దృష్టి నాకర్షించియుండుటచే కార్యరూపమునగా కుండినను సిద్ధాంతరూపమున ఆలోచనాంశమైయుండుటచే మూడుసంవత్సరములకు పూర్వము న్యాయ మతశాఖామాత్యులగు నవాబు మిర్జా యార్జంగు బహద్దరుగారి అధ్యక్షతక్రింద హైదరాబాదు నగరమందు "మద్యపాన నిరోధక కేంద్రసంఘము" సుపేర నొకసంస్థ యేర్పడి నది. దేశమునందంతట జరుగుచున్న మద్యపాన నిషేధప్రచారము గాంచి యీసంఘమువారు రాష్ట్రమునందంతట గత ౨ మార్చి బుధవారం రోజున మద్యపాన నిరోధకదినము జరిపిరి. నగరమునందు గల ప్రసిద్ధప్రదేశములందేగాక జిల్లాలలో యీదినము మతియుత్సాహముగా జరిగినటుల క్రిందివార్తలు విశదపరచుచున్నవి. పరమేశ్వరుడు ప్రజలయందు దృఢనిశ్చయము ప్రసాదించుగాక. నిషేధవిషయము, ప్రభుత్వ వారి మనోభావములు ప్రజలకు విదితమైనందున నాయకులనవసరముగా దీనిని రాజకీయవిషయముగా భావించి మౌనమువహించక తగురీతిగా ప్రజల ప్రోత్సహించి యుద్యమమును సఫలవంత మొనరించుటకు బూనుకొనిన దేశమున కెంతయో మేలుకలుగుననూచనలు గోచరించు చున్నవి.

### క్రోరుట్ల

ఇది మెదకుజిల్లాలో గలదు. ఇచ్చట ౨ మార్చి తేదిన యుదయమున నగరసంకీర్తనము జరిగినది సాయంకాలము నాలుగుగంటలకు సుమారు ౪–౫ వందల హిందూ మహమ్మదీయులు బ్యాండుతో నూరేగింపుజరిపి బాలుర ఖేలనాస్థలమునందు ప్రధానోపాధ్యాయుల అధ్యక్షత క్రింద బహిరంగసభ జరిగినది. మద్యపానము వలన కలుగునష్టములు, హేయములు, వివరముగా ప్రజలకుబోధింప ప్రజలీదురభ్యాసము మానుటకు ప్రమాణ మొనరించిరి. ఆనాటినుండి కల్లువ్యాపారము రోజారోజు క్షీణించుచున్నది.

### పాలవంచ

ఇది వరంగలుజిల్లాలో గలదు. మానవుని యందవినీతి పశుత్వము మద్యపానమాపాదింపజేయును అన్నిమతములు నిషేధించినవని దేశమునకు దీనివలన కలుగు దుష్ఫలితములు ప్రజలకు స్థానిక గ్రంథాలయపక్షమున సమావేశపరచబడిన బహిరంగసభయందు ప్రజలకు బోధింపబడినది. అనేకులు త్రాగమని వాగ్దాన మొనరించిరి.

### రాయగిరి

శ్రీయుత బీరకాయల హనుమంతరావుగారి ప్రోత్సాహమున శ్రీయుత ఉత్పల వెంకటరావుగారి అధ్యక్షతక్రింద ఈశ్వరనామ సంవత్సర ఫాల్గుణశు॥ ౨ సాయంత్రము ౭ గంటలనుండి మద్యపాన నిషేధసభ జరిగెను. అందు శ్రీ బి. హనుమంతరావు మొదలగువారు మద్యపాన నష్టముల బోధించిరి, అంజయ్యగారు గౌండ్ల వారికి నష్టము ప్రభుత్వముద్వారా తిరిగి యివ్వబడుచో వారుగూడ మద్యనిషేధ ప్రచారము చేసి యిప్పటికన్న నైకువఫలితము చూపగలుగుదురనిరి

అధ్యక్షులవారు మద్యపాననష్టముల తెలుపుచు ప్రతిశుక్రవారము మద్యపాన నిషిద్ధమునకై ప్రచారము సలుపుచుండవలయునని చెప్పి మద్యపాన నిరోధకసంఘము స్థాపించిరి.

### భువనగిరి

మార్చి పగలు 3 గంటలనుండి ఊరేగింపుతో బయలుదేరి పెద్దమదరసాయొద్దకు కల్లు త్రాగకూడదను పాటలుపాడుచు భజనచేయుచు సాయంత్రము ౫ గంటలవరకు చేరిరి. మద్యపాననష్టములగూర్చి అనేకులు ఉపన్యసించిరి ఉత్పల వెంకటరావుగారు వ్రాసిన పద్యములు మో॥ స॥ అహమదుసా॥ వ్రాసిన గజల్ చదువబడెను. తుదకు అధ్యక్షులవారు మద్యపాన నష్టములగురించి ధారాళముగా నుపన్యసించిరి సాయంత్రము ౬ గంటలకు సభ ముగిసెను

### హనుమాపురం

ఈశ్వరనామసంవత్సర మాఘ బ॥ ౧౩ శివరాత్రి ౯ గంటలనుండి హనుమాపురంలో భువనగిరి విజ్ఞానాంధ్రభాషానిలయ కార్యదర్శులగు శ్రీయుత ఉత్పల వేంకటరావుగారి అధ్యక్షతక్రింద మద్యపాన నిరోధకసభకు దాదాపు అయిదారువందలమంది వచ్చియుండిరి మద్యపాన నష్టములగూర్చి పలువురు విపులముగా నుపన్యసించిరి.

"నేడు శివరాత్రి పుణ్యదినముగాన ఈమద్యపాన దురాచారమును మానుకొనుటకై దృఢమైనప్రతిజ్ఞ గైకొనుడు దీనిచే మీకు యిహపర సుఖములు గలుగునని అధ్యక్షులు బోధించిరి మద్యపానము విడిచిపెట్టుదుమని అనేకులు సంతకములు చేసిరి, దీనిచే గౌండ్లవారికి నష్టము కలుగుచున్నది గాన వారు ప్రచారకులపై దౌర్జన్యము చేయుచున్నట్లు తెలియుచున్నది

### నంది వనపర్తి

మద్యపాన నిరోధకదినము బాలురు, యువకులు వృద్ధులు ఉత్సవములో పాల్గొని గ్రామంలో ప్రతివీధులు పందులగుండా "కల్లుత్రాగకూడదు అని పిల్లలు కేకలు వేయుచు కల్లుదుకాణందగ్గరనుంచి హరిజనుల యిండ్లమీదుగా ఉత్సవమును సాగించిరి. హరిజనుల యిండ్లవద్ద అరగంటసేపు ఆగి హరిజన స్త్రీ పురుషుల వందరను పిలిపించి కల్లు సారాయి వగైరా మత్తుపదార్థములవలన కలిగేనష్టముల బోధించిరి హరిజన స్త్రీలు పురుషులు ఏకకంఠముగా ఈదినమునుంచి కల్లు సారాయిలు త్రాగమని ధీరప్రతిజ్ఞ చేసిరి.

### దేవరయాముజాల

సాయంకాలము ౫ గంటలనుండి ౭ గంటలవరకు బడి (ప్రాథమికపాఠశాల) బాలురు నగరకీర్తనము గావించి ౭ గంటలకు గ్రామమధ్యమున గుమిగూడిరి. అచ్చట బాలురందరు ఏకకంఠముగా మద్యపాన నిరోధ గీతముల బాడిరి. సుమారు ఏడున్నరగంటలకు ఉపన్యాసము లారంభమయ్యెను, తదనంతరము వి. ఆర్. రామకృష్ణారెడ్డిగారు మద్యపానమువలన నష్టకష్టములను నిరూపించుచు మద్యపానము తగనిదని బోధించిరి.

### కొడుమూరు

శ్రీ ఈటూరు వేంకటరామారావుగారి యింటిలో మద్యపాన నిరోధకసభ సమావేశమాయెను, ఈసభకు సుమారురెండువందలమంది వచ్చిరి. సభ సమావేశ ఉద్దేశమును వెంకటరామారావుగారు చెప్పిరి. ప్రజలు సంసిద్ధులైరి.

## గ్రిగ్ గారి ప్రతిపాదన త్రోసివేయబడుట

ఢిల్లి, మార్చి ౧౦

హైకాన్సు బిల్లుగురించి సర్ జేమ్సు గ్రిగ్ గారు ప్రతిపాదించిన విషయము కేంద్రశాసనసభయందు వోటునకుపెట్టి ప్రతికూలముగా ఓట్లు వచ్చుటచే త్రోసివేయబడినది.

విషయమును ప్రతిపాదించుచు గవర్నరు జనరలుగారు శాసనసభవారు నిరాకరించిన తీర్మానము లన్నిటిని తమ ప్రత్యేకాధికారమువలన అంగీకరించిరని గ్రిగ్గుగారు సభవారికి విశదపరచిరి.

ఈవిషయము పెంపకమే శాసనసభయందు "ఈనాటకమంత పెంచుచుడు" "సిగ్గుసిగ్గు" "ఉద్యోగము వదులుకొనుడ"ను నాదములతో నిండెను.

యూరోపియ సంఘాధ్యక్షులగు ఎల్. సి. బక్సు గారు మాటలాడుటకు లేవ కాంగ్రెసు సభ్యులనేకులు సభవిడచి లేచిపోయిరి.

## ఆంగ్లపాదరి హత్య

షాంఘాయి, మార్చి ౯

చీనాకాం రాష్ట్రమునందు చాంతూంగ్ నకు ౭౦ మైళ్లదూరములో ఆంగ్ల మెథడిస్టు పాదరీలగు గోల్డుకోబ్సగారు హత్యగావింపబడిరి. హత్యగావింపబడుటకు (వీరు మెట్టమొదటివారు). ఇది స్థానిక దోపిడిగాండ్ల కృత్యమనియు, మిషను గృహము దోచబడినటుల తెలియుచున్నది.

## రైళ్ల రాకపోకలు

H. E. H. ది నైజామ్సు స్టేటురైల్వే

(పెద్దలైను)

### చేరుట

| | సికింద్రాబాదు, (బి.జి.) గం.ని. | హైద్రాబాదు. గం.ని. |
|---|---|---|
| నం. 11 ఖాజీపేట-హైద్రాబాద బి.జి. ప్యాసింజరు | 6-26... | 7-1 (బి) |
| నం. 2 వాడీ-బెజవాడ ప్యాసింజరు | 7-52... | 8-26 |
| నం. 1 బెజవాడ హైద్రాబాద ప్యాసింజరు | 15-0... | 15-41 (ఎ) |
| నం. 10 పర్లి విజయనాథ్-సికింద్రాబాద ప్యాసింజరు | 20-30... | 2-1 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం. 9 సికింద్రాబాద-పర్లి విజయనాథ్ ప్యాసింజరు | 7-20... | 7-56 |
| నం 2 వాడి-బెజవాడ ప్యాసింజరు | 8-46... | 8-9 |
| నం. 12 హైద్రాబాద బి జి-ఖాజీపేట ప్యాసింజరు. | 19-45... | 19-4 (బి) |
| నం. 1 సికింద్రాబాద-వాడి ప్యాసింజరు. | 17-20... | 17-55 (బి) |

(చిన్న లైను)

### చేరుట

| | సికింద్రాబాదు, (ఎ.జి.) గం.ని. | హైద్రాబాదు గం.ని. |
|---|---|---|
| నం, 31 మన్మాడ్-హైద్రాబాద యం.జి. ప్యాసింజరు | 6-50... | 7-34 |
| నం. 35 ద్రోణాచలం-సికింద్రాబాద-ప్యాసింజరు | 18-50... | 18-18 |
| నం. 33 మన్మాడ్-హైద్రాబాద ఎం.జి. ప్యాసింజరు | 20-41... | 21-10 |
| నం. 27 ద్రోణాచలం సికింద్రాబాదు ప్యాసింజరు | 6-0.. | 5-25 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం. 34 హైద్రాబాద ఎం జి. మన్మాడ్ ప్యాసింజరు | 7-33... | 6-50 |
| నం. 36 సికింద్రాబాద-ద్రోణాచలం ప్యాసింజరు | 7-0... | 7-24 |
| నం. 32 హైద్రాబాద-యం.జి. మన్మాడ్ ప్యాసింజరు | 20-0... | 19-5 |
| నం. 8 సికింద్రాబాదు ద్రోణాచలం ప్యాసింజరు | 22-0.. | 22-20 |

**నోటు:—**

(ఎ) హైద్రాబాద బి.జి. రేవ పిదప సికింద్రాబాద వెళ్లును. తిరిగి సికింద్రాబాద నుండి 17-20 గంటలకు వాడికి బయలుదేరును.

(బి) ఈబండ్లు ఖాజీపేటలో ఢిల్లి,మద్రాసు మధ్యనమ్న, వెళ్లు గ్రాండుట్రంక్ యెక్స్ప్రెస్ బండ్లతో, వాల్తా బెజవాడమధ్యగల మెక్సైన్ బండ్లతో కలుపును.

# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర పాల్గుణ శు॥ ౯

గురువారము

## నిజాంరాష్ట్రాభివృద్ధి ౧౯౩౩-౧౯౩౭

మన రాష్ట్రపరిపాలనను గూర్చిన వార్షిక నివేదికలు ఇంతవరకును చాల ఆలస్యముగా ప్రకటించబడుచున్నవి. ఇంతవరకును ప్రకటించబడి, మాకుచేరిన నివేదికలలో కట్టకడపటిది ౧౩౪౫ ఫ. ది; అనగా నిది మూడేండ్ల వెనుకబడియున్న దన్నమాట. ఇటువంటి పరిస్థితులలో ప్రభుత్వమువారు క్రీ. శ. ౧౯౩౩ మొదలుకొని ౧౯౩౭ వరకు గల ఐదేండ్లలో మనరాష్ట్రము యొక్క అభివృద్ధిని సూచించు సంక్షేప నివేదిక నొకదానిని ప్రకటించియుండుట ప్రశంసనీయమైన విషయము. ఇదివరకు ఎప్పటికప్పుడు వార్తలరూపమున ఈ పత్రికచే తెలుపబడిన విషయములను వదలి, ఈ నివేదికకాలములో ముఖ్యముగ గమనించదగిన విశేషముల నన్నిటిని, పాఠకులకు తెలియుటకై, స్థలాంతరమున ప్రకటించియున్నాము. మన రాష్ట్రములో సాధారణముగా ప్రజలకు వార్తల రూపమున తెలియని కొన్ని క్రొత్త విశేషములు అప్పుడప్పుడు నివేదికలలో తెలియుచుండును. అందుచే ఈనివేదికలయొక్క విలువ మనరాష్ట్రము వారలకు ఇతర రాష్ట్రములలో కంటె ఎక్కువ. కనుక సాధారణముగా ప్రతి వార్షికపరిపాలనా నివేదికను, సంపూర్ణముగ సకాలమున ముద్రించి పంపకాల నంతకాలము ప్రభుత్వమువారు ప్రతివార్షికనివేదికనుండియు, ముఖ్యముగా ప్రజలు తెలుసుకొనుటకు కుతూహల పడునట్టి విశేషములను, వాటికి సంబంధించిన లెక్కలనుమాత్రము తెలియజేయులఘు నివేదికలను, ఇపుడు౧౯౩౩నుండి ౧౯౩౭ వరకు గల అయిదేండ్లకాలమునకు చేసినట్లె ముందుగా సకాలమున ప్రకటించుట అవసరమని మాకనిపించుచున్నది.

ఇపుడు ప్రకటించబడిన అయిదేండ్ల అభివృద్ధినిగూర్చిన నివేదికలో, కొన్ని కొన్నియంశములలో—ఉదాహరణార్థము, మొత్తము రైలుమార్గముయొక్క పొడవునుగూర్చిన యంశములో—నివేదికకు సంబంధించిన అయిదేండ్ల కాలములో ఎంత అభివృద్ధి జరిగినదో స్పష్టముగా చెప్పబడలేదు. కొన్ని అంశముల విషయములో ౧౯౩౭ సం॥ అంకెలు ౧౯౩౪ సం॥పు అంకెలతో పోల్చబడినవి. అనగా ౪ ఏండ్ల అభివృద్ధిని సూచించు అంకెలు మాత్రమే తెలుపబడినవి అయిదేండ్ల కాలములో ఎంత అభివృద్ధి జరిగినదో లెక్కించుకొనుటకు, ౧౯౩౩ సం॥మునకు సంబంధించిన వార్షికనివేదికలోని వివరములనుకూడ చూడవలసియుండును. ప్రస్తుత నివేదికయందే అట్లు పోల్చుకొనవలసిన అంకెలను ఇచ్చినచోగాని, ఇదిస్పష్టముగా అయిదేండ్ల నివేదిక యనిపించుకొనజాలదు. ఈనివేదికయందు వ్యవసాయమును పరిశ్రమను గూర్చిన ముఖ్యవిషయములు తెల్పబడినవిగాని ఈరాష్ట్రముయొక్క వ్యాపారాభివృద్ధిని సూచించు ఎగుమతులు దిగుమతుల, సంబంధములగు ముఖ్యవిశేషములు తెల్పబడలేదు. అవియు తెలుపబడియుండిన చాలబాగుండెడిది.

ప్రస్తుతనివేదికలో మొత్తముమీద ప్రభుత్వమువారిని ప్రశంసించుటకు ఆధారములుగ నుండగల నాలుగు విశేషములున్నవి. అందు మొదటిది గ్రామముల ఋణభారవిచారణ పూర్తియై, ఋణబాధితులను మంచిస్థితికి దెచ్చు నుద్దేశ్యముతో ఇపుడున్న ఋణభారమును భరింప వీలైనంత మట్టుకు తగ్గించుటకును, ఇకమీద వడ్డీవ్యాపారము ఋణభారమును హెచ్చించకుండ సాగునట్లు చేయుటకును, భూముల గిర్వీపెట్టువిషయములో నియమము లేర్పరచుటకును తయారుచేయబడిన చిత్తుశాసనములు ప్రభుత్వాలోచనలో నున్నవను అంశము. ఈచిత్తుశాసనములను గూర్చి ప్రభుత్వమువారి అంత్య నిర్ణయమగులోపలనే ప్రజలలో వివిధ పక్షములవారల అభిప్రాయములు కూడ తెలిసికొనబడినచో, క్రొత్త శాసనముల వలన గ్రామస్థులకు వారల కవసరమైన అప్పు లభించకుండ చేయు చిక్కు లేర్పడకుండ జాగ్రత్త వహించుటకు వీలగును. ప్రభుత్వమువారు ఇట్టి జాగ్రత్తల నన్నిటిని గుర్తించియున్నారనియు, త్వరలో రైతులకు సంతోషము కలిగించు కాలము రానున్నదనియు ఆశించుచున్నాము.

ఇక రెండవ విషయము ఇంతకంటె తక్కువ సంతోష మొసగునది కాదు. ప్రాథమికదశలోవలెనే సెకండరీదశలోకూడ విద్యను మాతృభాష ద్వారా నేర్పుటకు ఉత్తమమార్గమేమాయని ప్రభుత్వమువా రాలోచించుచున్నట్లు చెప్పబడినది. ఇది త్వరలో తేలి, ఉన్నత విద్యవరకును విద్యార్థుల మాతృభాషలో నేర్పుపద్ధతి స్థిరపడిననాడు రాష్ట్రీయుల కృతజ్ఞతా వందనములు వేలకొలదిగ ప్రభుత్వమువారికి చేరగలవు. మనప్రక్క రాష్ట్రమగు మదరాసు రాష్ట్ర ప్రభుత్వమువారు అప్పుడే సెకండరీవిద్యను విద్యార్థుల మాతృభాషలో నేర్పునటుల ఏర్పాటుచేయుటకు నిశ్చయించుకొనినారు. బ్రిటిషిండియాలోని ఇతరరాష్ట్రములును ఇదే పద్ధతి నవలంబించుటకు సిద్ధముగనున్నవి. ఇట్టి సమయములో సంస్థానములలో అగ్రగణ్యమగు మన సంస్థానము ఈవిషయములో ఇంకను ఉపేక్షించుట యుక్తముగా నుండదు.

మూడవ విశేషము. ౫౦ లక్షల ఖర్చుతో ౫ మొదలుకొని ౭ వేల టన్నులవరకు కాగితమును ఉత్పత్తిచేయగలయంత్రమును పెట్టికాగిదపుపరిశ్రమను స్థాపించు విషయమునుగూర్చి ఆలోచన జరుగుచున్నది. కాగిదపు పరిశ్రమను మన రాష్ట్రములో స్థాపించుటకు మంచి అవకాశము లున్నట్లు ప్రభుత్వము వారికి ౧౯౩౩కు ముందే సూచనలు పోయి యుండవలెను. అప్పటినుండియు ఈ విషయమును గూర్చి సమగ్రముగ పారిశ్రామిక శాఖయందును, ప్రభుత్వమువారివద్దను ఆలోచన జరుగుచుండవలెను. ఈపరిశ్రమను మంచిపద్ధతులపై స్థాపించుచో దానివలన మన రాష్ట్రమందు జీవనోపాధికి క్రొత్తపనులు దొరకుటకు అవకాశము లభించగలదు. ఇటీవల విదేశములనుండి వచ్చుకాగిదము ధరహెచ్చినప్పటినుండి, ఈ దేశమునకు కావలసినంత కాగితమును దేశమందే తయారుచేసి అంకజేయుటకై కాగిదపు పరిశ్రమను వృద్ధిచేయుటను గూర్చి అక్కడక్కడ ఆలోచనలు జరుగుచున్నవి. ఈ అవకాశములోనే మైసూరు రాష్ట్రమందు క్రొత్తగా కాగిదపు పరిశ్రమ స్థాపించబడినది. మన ప్రభుత్వము వారును విశేషము ఆలస్యము చేయక మంచి మార్గముల ననుసరించి పరిశ్రమను స్థాపించుట కిదియే తగినసమయము.

కట్టకడపటి విశేషము, కారాగారములు కేవలము శిక్షాప్రదేశములుగ గాక, తప్పుత్రోవ త్రొక్కినవారిని సరియైన త్రోవకు దప్పించుటకై సంస్కరణచేయు ప్రదేశములుగ కూడ నున్నవని వినుటకు సంతోషమగుచున్నది. శిక్షపొందిన నేరస్థుడు శిక్షాకాలమును గడపి కారాగారముదాటి బయటి ప్రపంచములో అడుగుపెట్టు నప్పటికి అతనియందుగల నేరముల జేయు తత్వమే మారిపోవునట్లు చేయు విధానమే నిజముగా ఉత్తమమైనది. ఆధునిక నాగరక రాజ్యములన్నిటియందును ఇట్టి సిద్ధాంతములే నెలకొనుచున్నవి. నేరస్థులు విడుదల జెందిన తర్వాత, వారలు తిరిగి నేరములు చేయుటకు ఎట్టి యాకర్షణయు నుండకుండ జేయుటకై వారలకు సంతృప్తికరములైన బ్రతుకు తెరవులను చూపించుటకును కారాగారముల ఉన్నతాధికారియగు హాలిన్సుగారు మంచి శ్రద్ధవహించు చున్నందుకు సంతోషించుచున్నాము.

## కాయకల్ప చికిత్స

మాలవ్యాగారు ఆయుర్వృద్ధికై పొందిన కాయకల్ప చికిత్స దేశీయులందరి దృష్టులను అధికముగా ఆకర్షించినది. ౭౦ ఏండ్ల వయసేమి? తిరిగి ౪౦—౫౦ ఏండ్లవాని దృఢకాయము వచ్చుటయేమి? యని అందరును ఆశ్చర్యపడిన వారే. కాని చికిత్సచేసిన తపస్వి విష్ణుదాసుజీ ఉదాసీగారు తుదకు జయించి, అభినందన పరంపరలను బొందు చున్నారు. చికిత్సచే మాలవ్యాగారి శరీరముపై మునలితనపు ముడతలు పోవుటయేగాక, వీపుగూని పోవుటయు వారు సులోచనములు లేకుండ చిన్న అక్షరములను చదువగల్గుటయు, శ్రమలేకుండ ఎంతి దూరమైనను నడువగలుగుటయు—ఇది యంతయు ఆయుర్వేదము యొక్కయు, భారతదేశముయొక్కయు గౌరవమును వృద్ధిజేయుట కెంతయో ఉపయోగించగలవు. తపస్వి విష్ణుదాసుగారే యీ కాయకల్ప చికిత్సను మూడుసారులు పొంది ౧౨౭ వ ఏట ౫౦ ఏండ్ల వయసు గల వారివలె కనబడుచున్నను, ఆధునిక నాగరికతా పరిస్థితుల మధ్య అంతగా ఆకర్షించని కాయకల్ప మహిమ, మాలవ్యాగారి వార్ధక్యమును పోగొట్టి ఆశ్చర్యకరమైన ప్రఖ్యాతి గాంచినది. మాలవ్యాగారు అట్టి కాయకల్ప చికిత్సాసంస్థ నొకదానిని స్థాపించుటకు సంకల్పించియుండ, అప్పుడే కాశీహిందూ విశ్వవిద్యాలయమునకు జెందిన కవిరాజ ప్రతాపసింహగారి యాజమాన్యమున ఇరువురు సన్యాసులకు కాయకల్ప చికిత్స ప్రారంభించ బడినది. ఈచికిత్సల విజయము, చికిత్సాక్రమమును గూర్చియు, చికిత్సలో వాడబడు ఓషధుల గుణములనుగూర్చియు ఆధునిక పద్ధతులపై శాస్త్రీయపరిశోధనకుగూడ త్రోవతీయునని తలచవచ్చును. కాని ప్రస్తుతము గమనించదగిన దేమన, మాలవ్యాగారి చికిత్సపొంది భారతదేశము యొక్క మహిమ నుద్ఘాటించినారు.

## కార్మికుల కర్షకుల ప్రచండసభ

బనారసు మార్చి ౯

బనారసు తహసీలు కర్షకులు, రైతులుగాంధను కాలినడకలో విస్తరవాదముల ప్రతిధ్వనింపజేయుచు గొప్పయూరేగింపుతో నిన్నమధ్యాహ్నము నగరము ప్రవేశించిరి. వేలకొలది వీరు నగరవీధులలో సంచారమొనరించినగరభవనము చేరిరి అచ్చట సభ సమావేశమయ్యెను. రైతుల అభ్యుదయమున కవసరమగు తీర్మానములు తీర్మానింపబడినవి.

కాటర్వర్క్సు యుద్యోగులు తమకుగల ఆసౌకర్యముల తొలగింపుటకుగాను యూరేగింపుతో నగరవీధుల సంచరించి నగరభవనమునందు సభ సమావేశపరచిరి.

# స్వాతంత్ర్య సమర నిశ్చయము

## ప్రభుత్వమువారు తమ పాలసీ వివరించ వీలులేదని విశదపరచుట

## బాధ్యతాయుత ప్రభుత్వసంస్థాపనమే ప్రజలఆదర్శము

(గోలకొండపత్రిక)

బెంగుళూరు: మార్చి ౭

పండిత జవహార్లాలు నెహ్రూగారి అతిథి మహారము సర్ మీర్జా యిస్మాయిల్ గారు కాంగ్రెసు వాదులతో కలిసి మాటలాడుటకు నిశ్చయించినటుల తెలుపు కారిపురవ (?) సానంతరము శ్రీ. కె. టి భాష్యంగారు 3 మార్చి తేదిన దివానుగారిని సందర్శించి సంస్థానపు పరిస్థితుల, కాంగ్రెసు కార్యముల గురించి మాట్లాడించి అధ్యక్షులగు శ్రీ టి. సిద్ధలింగప్పగారితో సంప్రతించుటకు అభిలషింపి మిర్జాగారు సమ్మతించిరి.

శ్రీ టి. సిద్ద లింగయ్యగారు దివానుగారితో సంప్రతించి వెడలుచుండ పత్రికాప్రతినిధులతో "మాయిరువురి చాల విశ్వాసకరముగా గలదు. మా సమరవిర్ణయమునకచ్చిన్నము నిర్ణీత కార్యక్రమమును సాగించుటయే మా కర్తవ్యము"ని విశదపరచిరి.

ఈ ఉభయులు సుమారు ౭౦ నిమిషములవరకు కలిసి మాటలాడిరి.

ప్రభుత్వమువారి ఉద్దేశము సంస్థానమందు బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనమే యగునని వివరించుటకు దివానుగారిని కోరగా "ఇప్పటి పరిస్థితులలో ప్రభుత్వమువారి పాలసీని వర్ణింపడ వీలులేదనియు, ప్రజలలో గలిగిన రాజకీయాభివృద్ధి గమనించి మరికొన్ని సంస్కరణములు ప్రసాదించుటకు విచారణసంఘ వినియామకము జరుగనున్నదనియు, వారదివిచారించి తమ నివేదికయందు కాంగ్రెసువారి సూచనలు గమనించి తగు సిఫారసులు చేయుదురనియు, ప్రభుత్వముపై విశ్వాసముంచుటకు దివానుగారు సిద్ధలింగయ్యగారిని కోరినటుల తెలియుచున్నది.

ప్రభుత్వమువారి యుద్దేశ్యము వివరముగా ప్రజలకు విశదపరచవలయుననియు, కేవలము మాటలమాత్రము కాంగ్రెసువారి కోర్కెలు తీరవనియు, కావున ప్రారంభించిన సమరము సాగించెదమనియు, శిక్షలు కలిగినంత మాత్రాన విరమించగలవారము కాదని యీ ప్రజల కార్యదీక్ష సిద్ధలింగయ్యగారు దివానుగారికి తెలియజేసినటుల తెలియుచున్నది.

ఎవరికే పదవి ఉత్తమముగా దోచిన వారు దానిని అవలంబించవచ్చునని దివానుగారు చెప్పినటుల కలదు. ఈ విషయమంతయు సమావేశమగునున్న కార్యకారిణీసంఘమునందు విచారింపబడగలదని దివానుగారికి విశదపరచి విచారణ సంఘమునందు చేరుటకు కాంగ్రెసు సభ్యులు నామములు సూచింప వలయునని దివానుగారు నుడివినటుల కలదు.

## లోధియన్ ప్రభువుగారి స్వానుభవము

### రాష్ట్రీయమంత్రుల సివిల్ యుద్యోగుల సఖ్యసంబంధము

### రాష్ట్రీయ స్వపరిపాలనా విజయము

### భావి నూతన శాసన పరిణామము

అలహాబాదు మార్చి ౯

భారతదేశమంతయు పర్యటన మొనర్చి ఇంతవరకు నగరమునకేగిన లోధియన్ ప్రభువుగారు మొన్న మార్చి భారతసంఘసభవారి యాజమాన్యమున సమావేశమైన బహిరంగసభయందు లోధియన్ ప్రభువుగారు భారతదేశమునందు నూతనశాసనమున యేర్పడు కార్యరూపము గురించి ప్రాముఖ్యముల వివరపరచిరి. సభయంతయు ఆనందించిరి. "పూర్వపు ప్రభుత్వము కాలేజీనడకతో ప్రాచీనసాంప్రదాయమైయుండినదనియు మారినప్రభుత్వము. బ్రిటిష్ యందసంధియైనను, అతి త్వరగామిముగుటకు ప్రయత్నించున్నది. ఆ లేక రాష్ట్రములందు ఆ సంస్కరణ లాచరింపచేయుటకు సవ కట్టినందున మంత్రులు, సివిల్ సర్వీస్ యుద్యోగులుంధిక కార్యముతో దక్షిణయుక్తులు గల ద"నిరి.

ప్రతిపక్షమువారలగురించి ముచ్చటించుచు "ముందు ఆలోచనముగానుండినను ప్రస్తుతము మాత్రము మంత్రులు సివిల్ యుద్యోగస్థుల సంబంధములు సంతృప్తికరములుగా గలవు. ఇది ఉభయుల చాకచక్య ఫలితమనవచ్చును. కాంగ్రెసు మంత్రులకు వీరివలన ఆలేక యిబ్బందులు సంభవించుటలేదన వీలులేదు." అని నుడివిరి.

"పదవీస్వీకరణానంతరము కాంగ్రెసు వారు కార్యము జరుపుటకు, లా అండ్ ఆర్డర్ సంరక్షించుటకు, పరిపాలనమునందు యుండులచే కలిగింపబడు చున్న ఆటంకముల తొలగించి వేయుటకు ప్రయత్నించుచున్నారు. ఇదివరకు దేశమందొకవిధమగు అపోహ అనగా కాంగ్రెసువారు సివిల్ యుద్యోగుల ధ్వంసమొనర్చుటకు సంకల్పించినదనునది నిరాధారము. రాష్ట్రీయ స్వపరిపాలనము ప్రస్తుతము వివిధపక్షములందు రాజకీయ చైతన్యముల అభివృద్ధి పరచుచున్నది. గాని మొత్తముపై యీ రాష్ట్రీయ స్వపరిపాలనము ఫలవంతముగా పరిణమించినది. ప్రతిమంత్రివర్గము వారు తమబాధ్యతలు చక్కగా గ్రహించుచున్నార"ని పలికిరి.

## రాజకీయ ఖైదీల దినము

కలకత్తా మార్చి ౯

౧౪ మార్చి తేదిన వంగదేశమునందంతట రాజకీయ ఖైదీల దినము జరుపుటకు వంగరాష్ట్రీయ కాంగ్రెసుమహాసభవారు నిశ్చయించిరి. గ్రామగ్రామములందు యూరేగింపులు జరిపించుటకు, నగరసంకీర్తన మొనరించి సభలసమావేశపరచి ఖైదీల విడుదలకై తీర్మానించుటకు జిల్లా కాంగ్రెసు సంఘములకు ప్రకటనలైనవి. కలకత్తాయందు శ్రీ బాబుసుభాషుచంద్రబోసు గారి అధ్యక్షత క్రింద జరుపుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

## షాంఘాయిలో ౭ లక్షలపౌండ్ల నష్టము

షాంఘాయి, మార్చి ౯

షాంఘాయి నగరమునందు యుద్ధమూలమున విదేశీయులకు కలిగిన నష్టముల మొత్తము ఆయా దేశముల కౌన్సలు కార్యాలయముల వలనను ౭ లక్షల పౌండ్ల నష్టము కలిగినటుల తెలియుచున్నది.

చీనాదేశపు యుద్ధరంగ కార్యాలయము ఆపాయకరిగానుండు గలదు, జపానువారు దానిని ఆక్రమించుకొనుటకు ప్రయత్నించుచున్నారు. ౨౦ విదేశీయులచేతి యుద్ధవిమానముల వలన కొట్లాటప్పుడు ౨ చెలియబడుచున్నది. ఈవిధముగా షాంఘాయి, టోక్యో నగరములమధ్య సంగ్రామములు జరుగుచున్నవి.

# స్వదేశ సంస్థానాలలో ప్రజలకు సామాన్యపు హక్కులు లేనేలేవు

## నిర్బంధాలు నిషేధపుటుత్తరువుల ప్రళయతాండవము

రవీంద్రనాథ టాగూరు

దేశంలో నిర్బంధాలు, నిషేధపుటుత్తర్వుల సంఖ్య రోజారోజుకు పెరిగిపోతూ వున్నాయి. ఈ సందర్భంలో మాయమూల పల్లెలలో యీ నిర్బంధాలకు గురి అవుతున్న వారి అతిగతి కనుక్కొని ఆ వివరాలను ప్రకటించడానికి వున్న సివిల్ లిబర్టీస్ యూనియన్ శాఖలు చాలడంలేదు. అందుకనే మైసూరు నగరంలో మరోశాఖను యేర్పాటుచేశారు. ఇలా వేరువేరుచోట్లవున్న సివిల్ లిబర్టీస్ యూనియన్లు దర్యాప్తుచేసి, ఆయాచోట్లఅనుసరింప ఒడుతూవున్న నిర్బంధ విధానాలను, ఆనిర్బంధాలకు గురియైనవారిని ఆనిర్బంధ చర్యల ప్రభావము

మనుకొంచి ఇండియన్ సివిల్ లిబర్టీస్ యూనియన్‌కు తెలియజేశాయి. ఇండియన్ సివిల్-లిబర్టీస్ యూనియన్‌వారు యింతవరకు తమకు వచ్చినవృత్తాంతాన్నంతా ప్రకటించారు.

### మైసూరు

జీవనగరకు చెందిన యస్. శీటారామగారికి ధైలూర్‌లో రాజద్రోహకరమైన వుపన్యాసం చేశాడనే నేరానికి ఒక సంవత్సరం కఠినశిక్ష రు ౫౦౦ లు జరిమానా, హోసదుర్గలోయిచ్చిన మరొక వుపన్యాసానికి ఆరునెలలు శిక్ష, రు ౨౫౦లు జరిమానా విధించి, రెండుశిక్షలను వరుసగా అనుభవించాలన్నారు. ౧౯౩౭ నవంబరు ౩౦వ తేదీన దొడ్డబల్లాపూరులో చేసిన వుపన్యాసం రాజద్రోహకరంగా వున్నదనే నేరం ఆరోపించి, బెంగుళూరుకాంగ్రెసు ప్రముఖులలో ఒకరైన సూర్యనారాయణ పండితుగారిని జనవరి ౨వ తేదీన మైసూరులో అరెస్టు చేశారు. చిక్‌బల్లాపూర్‌కు చెందిన టి. యస్. పండితుకుమార్, హెచ్. వి. శ్రీకంఠయ్య, కె. సంపంగి రామయ్యగార్లకు. మీ వుపన్యాసాలు ప్రజలలో ప్రభుత్వంయెడ ప్రభుత్వోద్యోగులయెడ అసంతృప్తిని అసహ్యభావాన్ని కలిగిస్తున్నాయి గనుక వుపన్యాసాలు మానుకోవలసిందంటూ జిల్లా మేజస్ట్రీటు హెచ్చరికచేశారు. మేజస్ట్రీటు వుత్తర్వును లెక్కచేయకుండా వుపన్యాసాలు చేసినందుకు మాధవాచారి మల్లయ్య అనే యిద్దరు కాంగ్రెస్ వారుకు ఒక్కొక నెల మైనశిక్ష, రు ౫౦ ల జరిమానా విధించారు. జనవరి ౨౬వ తేది స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో ఎలాంటిసభలు వూరేగింపులు వుపన్యాసాలు చేయరాదంటూ నిషేధపుటుత్తర్వులను ప్రకటించవలసినదిగా సంస్థానంలోని మేజస్ట్రీటులందరికీ మైసూరు ప్రభుత్వం తెలియపరచినట్లు ప్రకటితమయింది. బెంగుళూరుజిల్లా మేజస్ట్రీటు స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో ఎలాంటిసభలు, వూరేగింపులు, మొదలైనవి జరుపరాదంటూ వుత్తర్వుగూడచేశారు. బెంగుళూరుజిల్లాకు చెందిన దొడ్డబల్లాపూరు అమిల్దార్ మేజస్ట్రీట్ జాతీయపతాకాన్ని యెగురవేయరాదని క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ౧౪౪వ సెక్షను ననుసరించి వుత్తర్వు చేశారు మైసూరుప్రభుత్వం. జనవరి ౧౫వ తేదీన శానప్పపాళ్యంలో సభలు జరుపుటను నిషేధిస్తూ ఆదివరలో చేసిన వుత్తర్వును మరి ఆరు మాసాలవరకు పొడిగించినట్లు ప్రకటించింది. డిశంబరు ౬వ తేదీన రాజద్రోహకరమైన వుపన్యాసం చేశాడని జనవరి ౨౧వ తేదీన మైసూరుజిల్లా కాంగ్రెసుసంఘ ప్రధానకార్యదర్శి హెచ్. వి. రామప్పగారిని అరెస్టుచేశారు.

### అండమాను ఖైదీలు

జనవరి ౨౧వ తేదీన ౧౧౯మంది రాజకీయఖైదీలు అండమాను దీవులనుండి కలకత్తా చేరారు. అండమానులలోవున్న ఖైదీలలో ఇంతీయాకువచ్చిన ఆఖరుజట్టు ఇదే. ఈమధ్యనే గాంధిజీకోరికపై నిరశనవ్రతాన్ని చాలించిన ఖైదీలు తిరిగి ప్రారంభించారు. ఇలా పంజాబులో పదమూడుమంది బీహారులో తొమ్మిది బెంగాలులో పదిమంది నిరశనవ్రతం చేస్తున్నారు. ఈ ఖైదీలు ౧౯౩౭ నవంబరు ౨౭వ తేదీన గాంధిమహాత్మునికి వ్రాసినలేఖలో "రాజకీయ ఖైదీల విడుదల సమస్యకొన్ని నెలలక్రితం ఎక్కడవుందో యిప్పుడూ అక్కడనేవుంది. మావర జీవితాన్ని బలియివ్వడం అనే బెదిరింపుగూడ ప్రభుత్వ ధోరణిని కదలింపలేదు" అని వ్రాశారు. డక్కా సెంట్రల్ జైలులో శిక్ష అనుభవిస్తూవున్న ౨౭యేండ్ల వీరయువకుడు హరేంద్రనాథ మున్షీ జనవరి ౨౧వ తేదీన నిరశనదీక్షపూని, ౩౦వ తేదీన మరణించాడు. మున్షీ ౧౯౩౨ లో టటగర్ ఆయుధములు దొరికినకేసులో ఆయిదు సంవత్సరాల శిక్ష విధింపబడ్డాడు. ఈఖైదీలలో మరికొందరి స్థితి ఆందోళనకరంగా వున్నది. కొంతమందికి బలవంతంగా ఆహారంలోనికి పంపించారు.

### ఇనుప కచ్చుల వెనుక యువతీమణులు

ఇంతకంటె తలవాటకలిసంగావుంది జైళ్లలో మ్రగ్గుతున్న స్త్రీలస్థితి. మనదృష్టిని వెంటనే వారివైపుకు మరల్చవలసివుంది. బెంగాలులో ఏడుగురు, అస్సాంలో ఒకరు ఆ యినుపకచ్చుల వెనుక తమ ఆరోగ్యాన్ని కోల్పోయి దయనీయమైన స్థితిలో వున్నారు.

సునీతిచౌదరికి ౧౪ సంవత్సరాల వయసులోనే యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్ష విధింపబడ్డది. ఆమె క్షయవ్యాధిపీడితయై వుంది. శ్రీమతి రాజలక్ష్మిదేవి, శ్రీమతి సువర్ణలతాదేవిగార్లను మామూలు ఖైదీలతోపాటు బి. క్లాసులో వుంచారు. కుమారి శాంతిఘోష్ ౧౫ సంవత్సరాల ప్రాయమునందే ద్వీపాంతరవాసశిక్షను పొందింది. కుమారి-శిబానాన్‌కి తొమ్మిదిసంవత్సరాలు శిక్ష విధింపబడ్డది. కుమారి విజయదేవికిగూడ క్షయవ్యాధి చిహ్నసూచకలు కనపడుతున్నాయి. ఇక ప్రభుత్వానికి వ్యతిరేకంగా అస్సాంలో బయలుదేరిన తిరుగుబాటులో పాల్గొన్న నేరానికి పేరయ్యవతి, గిడాల్లో యావజ్జీవశిక్షను అనుభవిస్తూవుంది. ఈవీర యువతులంతా వెంటనే విడుదలకావాలి.

### నిషేధపుటుత్తర్వులు

పంజాబు రాజకీయఖైదీల విడుదలసంఘమువారు జరుపదలచిన వూరేగింపు పంజాబు అసెంబ్లీకి చుట్టూ మైలుదూరంలోపల జరుపరాదంటూ పంజాబు ప్రభుత్వం ౧౪౪ సెక్షనుప్రకారం ఉత్తర్వుచేసింది. ఆవుత్తర్వు జనవరి ౩౧వ తేదీవరకు అమలులోవుంది.

లాహోరుజిల్లా మేజస్ట్రీటు వారం రోజులవరకు ఎలాంటి వూరేగింపును నాయకత్వం వహించి నడుపరాదంటూ పంజాబు సోషలిస్టుపార్టీ కార్యదర్శి మున్షి అహమ్మద్‌గారికి ౧౪౪ సెక్షనుక్రింద నిషేధపుటుత్తర్వును జారీచేశాడు. అమృతసరులలో గా ఢిల్లీదిచి పోవాలనే చీఫ్‌కమీషనర్ వుత్తర్వును వుల్లంఘించినందుకే జనవరి ౨౭వ తేదీన జోగేశచంద్ర చటర్జీకి సిటీ మేజస్ట్రీటు నాలుగుమాసాలు కఠినశిక్ష విధించాడు.

---



### బికనీరు

బికనీరు ప్రజామండలి కార్యదర్శి స్వామి లక్ష్మీదాస్‌గారికి సంస్థానంనుంచి వెళ్ళిపోవలసిందంటూ బికనీరు ప్రజాసంరక్షక చట్టాన్ననుసరించి వుత్తర్వు జారీచేయబడింది కాని దాస్‌గారు ఆవుత్తర్వును వుల్లంఘించినందుకు ఒకనెల కఠినశిక్ష విధించారు. ఒక మాసంఅంతా అసలు ఆయన్ను విచారణలేకుండా జైలులో వుంచారని చెప్పబడింది.

### జోధపూర్

జోధపూర్ సివిల్ లిబర్టీస్ యూనియన్ అధ్యక్షులు పురుషోత్తమదాస్ సయ్యద్ జోధపూరు ప్రజామండలి కార్యదర్శి సి. ఆర్. చోపల్లాగార్లపై ౧౯౧౯ మార్వార్ రాజద్రోహ చట్టము ననుసరించి కేసు చేయబడింది. ౧౯౩౭ మార్వార్ ఆర్డినెన్సు ననుసరించి ఇటీవలనే సివిల్ లిబర్టీస్ యూనియనును అక్రమ సంస్థగా ప్రకటించారు.

ఈవిషయమై ఇండియన్ సివిల్ లిబర్టీసు యూనియన్‌వారు వ్రాస్తేవారికి సమాధానం గూడ యివ్వలేదు. పైగా ౧౨౪ ఏ సెక్షను ననుసరించి అచలేశ్వర్ పాల్‌కు ప్రభుత్వం ౨౪ సంవత్సరాలు శిక్ష విధించింది.

కొల్హాపూర్‌లో స్వాతంత్ర దినోత్సవం జరుపుకోటానికి అనుమతిఇవ్వ నిరాకరించారట.

### మన్సాయెస్టేటు

మన్సా ఎస్టేటుస్థితి చెప్పనలవిగాదు. ఏదో రైతులకు సంస్థానానికిగల చిన్నపేచీని పురస్కరించుకొని రైతులసభల వూరేగింపుల నిషేధిస్తూ ఆర్డినెన్సు అమలులో వుంచడమే కాకుండా పోలీసులకు ప్రత్యేకాధికారాలను యిస్తున్నారు. పోలీసులు యీయవకాశం తీసుకొని ఇద్రాగ్రామంపై ధాడిపడలి చాలా మొరటుగా ప్రవర్తించారని తెలుస్తూవుంది. రైతులు ఆర్డినెన్సును వుల్లంఘించి మన్సా పట్టణంలో వూరేగింపులు, బహిరంగసభలు జరిపారు.

—ప్రజాబంధు.

### శర్మగారి సైకిలింగు రికార్డు

అలహాబాద, మార్చి ౯.

న్యూఒలంపిక్ అసోసియేషన్‌వారి యాజమాన్యమున శ్రీ కే. కె. శర్మగారు సైకిలింగురికార్డు నిర్మించుటకు ప్రయత్నించిరి. వీరు రాహాగంటల ౩౪నిమిషములవరకు కడతెగకుండ సైకిలింగు చేసిరి. అనగా అహోరాత్రములు శర్మగారు ౩రోజుల ౧౬గంటల ౩౪నిమిషములవరకు సైకిలింగు చేసిరి. శర్మగారు అలసియున్నటుల కనపడుచున్నను ఆరోగ్యముగా నున్నటుల డాక్టరులు పరీక్షించి విశదపరచిరి.

### కార్మిక కర్షకులస్థితి విచారించుటకు బీహారు ప్రభుత్వ నిశ్చయము

పట్నా; మార్చి ౯

రాష్ట్రమందలి ప్రత్యేక పారిశ్రామిక సంస్థలు, పరిశ్రమలు, వానియందలి కార్మికుల స్థితిగతులు విచారించి రాష్ట్రమందలి ముఖ్య పరిశ్రమల అభివృద్ధికి తగుయుపాయములు దెలుపుటకు, కార్మికుల అభ్యుదయమునకు అవలంబింపవలసిన పద్ధతుల సూచించుటకు బీహారు ప్రభుత్వము బాబు రాజేంద్రప్రసాదుగారి అధ్యక్షత క్రింద కార్మికవిచారణ సంఘమొకటి యేర్పరచినది.

ఈ విచారణసంఘమునందు యం. పి. గాంధి, ప్రొఫెసరు అబ్దుల్బారి,జగత్ నారాయణ్ లాల్ డా. ముకర్జి, డా. యచ్. బి చంద్రా యస్. కె. సారణ్ సభ్యులుగా నిర్ణయింపబడిరి.

కార్మికులనుండొకరిని సంఘమునందు సభ్యునిగా చేర్చుకొను అధికారము సంఘమునకొసగబడినది

### సున్నిషియాల సంఘర్షణ

లక్నో, మార్చి ౯

౭ మార్చిరాత్రి ౧౦౪ గంటలకు గాను నగరవీధిలో జరిగిన సభయందు సున్నిషియాలమధ్య చెలరేగిన విభేదములవలన పోరాటము జరిగి ౨గురు మరణించినటుల కొందరు గాయపడినటుల తెలియుచున్నది. నగర న్యాయాధీశుడు, పోలీసు అధికారిస్థలమునకు పోలీసుదళముతో నరుదెంచిరి.

### చీరాల కాల్పుల విచారణ

బాపట్లా, మార్చి ౯

న్యాయమూర్తులగు వార్శ్వేలుగారు చీరాల కాల్పుల విచారణకై నిన్నరుదెంచిరి. విచారణ ప్రారంభమైనది. సాక్షులపై ముఖ్యముగా పోలీసు సబు యినాస్పెక్టరుగారిపై అడ్డగవాళ్లు చేయబడినవి.



### బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపించుడు

ఇందూరు మహారాజుగారికి డాక్టర్ పట్టాభిగారి సందేశము

హరిజనులనుగూర్చిన ప్రకటనకు అభినందనము

బంబాయి, మార్చి ౭

"సంస్థానమందలి దేవాలయములలోనికి హరిజనులు రావచ్చునని ప్రకటించినందుకు మిమ్ములను మనసార అభినందించుచున్నాను. అన్ని ప్రదేశములలోను హరిజనులు ఇండ్లు కట్టుకొనవచ్చునని మీరు చేసినఆజ్ఞ తిరువాన్కూరు మహారాజాగారి ప్రకటనకంటె శ్రేష్ఠముగనున్నది. ఇందూరు సంస్థానములో బాధ్యతాయుత ప్రభుత్వము నేర్పరచుచు మీరు మరియొక ప్రకటనము గావింతురని నేను హృదయపూర్వకముగ కోరుచున్నాను."

అని కాంగ్రెసు కార్యకారిణీ సంఘసభ్యుడగు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు ఇందూరు మహారాజాగారికి తంతి సందేశము పంపిరి.

### ప్రజలు త్రాగమని శపథమొనరించుట

(గోలకొండ విలేఖరి)

బనిగండ్లపాడు, మార్చి ౭

గ్రామములో మద్యపాననిరోధక కేంద్రసంఘ నియమము ననుసరించి మ. బసవరాజు సత్యనారాయణరావు, మామునూరి నాగభూషణరావు శ్రీమాన్ సింగరాచార్యులు, మామునూరు కృష్ణారావు వగైరా ప్రముఖులందరు విచ్చేసి ప్రధాన అధ్యాపకులగు శ్రీ సర్వపురి వెంకట్రామయ్యగారి సహకారముతో బడిపిల్లల వెంటగొని గ్రామములో శ్రీమాన్ సింగరాచార్యులచే రచింపబడిన మద్యపాననిషేధక గేయములతో నగర సంకీర్తనము గావించి సుమారు రెండువందలమంది జానపదులు సమావేశమున ఆమితోత్సాహముతో పాల్గొనిరి శ్రీ నాగభూషణరావుగారు మద్యపానముచే కలుగుచున్న నష్టముల గురించి అందరికి విపులముగా తెలియునట్లు గంభీరోపన్యాసము గావించినారు. తత్ఫలముగా ౧౫ మంది నేటినుంచి త్రాగుడు మానుదుమని ప్రమాణముచేసి సంతకములు చేసియున్నారు. ఈ ఉపన్యాస ప్రచారముకల్ల గ్రామవాసులలో తీవ్రమగు సంచలనము కలిగినది, పిదప మహాత్మ గాంధీ జిందాబాదుఅను ఆరావములతో రాత్రి ౧౧ గంటలకు సభ ముగిసెను.

